శ్రీ

# కొౌతారు రామరావుగారి ప్రధానాచార్య రజతోత్సవ చిహ్నము

# సూ చి క

## కృతజ్ఞత.

ఏతత్కావ్య ముద్రణమునకుఁ గారణభూతమైన శ్రీ కొత్తారు రామరాయ ప్రధానాచార్యతా రజతోత్సవ సంఘమునకుఁ గృతజ్ఞుఁడను.

కృతికర్త.

# సవరణము

౪౮ వ పుట 7 వ పంక్తిలో

'వోయీ?' కి బదులు 'సుమా' అని.

శ్రీ

# క ల్యా ణ యా త్ర

శ్రీసతి వాలుఁ జూపుఁ బువుఁ జేరులు తెమ్మిన తియ్యతేనె, బ్రా
హ్మీసతి తంత్రిమీటి సెలయేఱుల వాకము సేయు సాహితీ
భాసరసాసవమ్ము, హిమవత్సుత కన్నుఁదుదల్ మలంపు లం
దోసరి చల్లనై పడు సితోదక మీ కృతిలో స్రవించుతన్.

ఓంకారాంకిత కింకిణీ శ్రుతులతో వ్యోమాంగనా దివ్య గీ
తాంకాలాపము మేళవింప, లయయుం దాళమ్ము గీలించి లా
స్యాంక న్యాసము దింధిమిద్ధిమితమానాలంకృతిం దీర్చు నే
ణాంకాలంకృతుఁ డీ కృతీశ్వరుని రామాఖ్యుం బితం జేయుతన్.

ఆత్మలోచన కాంతు లవఘళించిన శిష్య
హృదయాలు జి ల్లనిపించువాఁడు
ఆత్మరూపాలంకృతాసనుం డైనచో
దేశికోత్సాహమూ ర్తి యగు వాఁడు

ఆత్మ ధర్మదిదృక్ష నఖిలశాఖాసమా
నాభిమానము రూపమందు వాఁడు
ఆత్మ తీర్థాటనా హార సంస్కృతమైన
యాత్మలోఁ జిన్మూర్తి నరయువాఁడు

సకలకకుబంత మహనీయ సార్వభౌమ
సహజ లక్షణ సముచిత స్వచ్ఛశీల
మండితాచ్ఛశిరోష్ణీష మకుటమౌళి
కొలవని కొఠారు రామయ కోవిదుండు.

లలనా లలామ సల్లాప కావ్యశ్రీకి
నెలసి యేకాంతమ్ము నిచ్చె నేఁడు
నవనవలాడు లేఁగవటాకు పద్దెముల్
చివురించు కబ్బమ్ముఁ దవిలె నేఁడు
గోస్తనీఫలరసగుంఫనమ్ములఁ జిమ్ము
కృతిలోన నమృతుఁడై యెసఁగె నేఁడు
మధురభావార్థ వాఙ్మయదుగ్ధపాథోధి
క్రోలు గోవత్సముఁ గొనియె నేఁడు

---

ఈ పుటలో 7. వ పంక్తి నిట్లు చదువుఁడు.

మండితాచ్ఛ మూర్ధోష్ణీష మకుట మౌళి

ఎంత చక్కని యాత్మకు నంత సుకృతి
సంభవిలు నెంతకృతి కంత చక్కనాత్మ
నడిమివయసునఁ గన్న నా గడుసుకూన
ఇతనిఁ గా కన్యులను గోర దేమి చెపుమ ?

ఎవనికి నే లతాంగిని లిఖించెనో భార్యగ, నే లతాంగికిన్
ధవునిగ నెవ్వనిం దలఁచి దాఁచెనో మాయలమారి, తద్వధూ
ధవుల కెఱుంగ బోలునొకొ తత్సుముహూర్తము దన్క నెన్నడేన్?
అవునవు, రత్నముం దెలిసెనా మును బంగరు కూర్చు నంతకున్?

కవితారసాసవసక్తివ దాత్మహృదయ మం
జులభావసంచార శోభితుండు
మధురసుందరవినిర్మల తుష్టజీవన
సుమరమామోద నిస్తులసుఖుండు
తపనీయవర్ణ గాత్ర ప్రభాపరివేష
రమణీయరూప విగ్రహధరుండు
సంభాషణాద్యంత సరస వాఙ్మాధురీ
కమనీయ కౌశలక్రమయుతుండు

లౌకికస్ఫారరచనతులావచస్సు
ధాప్రసార విధా లేఖినీ ప్రభుండు
అరయ సామాన్యుఁడా బరాబరుఁడు నీకు
యశముఁ గొనియిమ్ము కావ్యకన్యాకుమారి,

ధన ధాన్య కనక వాహనము లాశించి నేఁ
గృతినీయ రాజ్యాధిపతివి కావు
ఉన్నతపదవీ ప్రయోజనార్థమ్ము నే
గృతినీయ నధికారి వీవు కావు
పూర్వవాగ్దాన సంపూరణార్థమ్ము నేఁ
గృతి నీయ 'వేంకన' వీవు కావు
ఇహలోక మజ్జన్మఋణ మీఁగ దలఁచి నేఁ
గృతినీయ మత్పిత వీవు కావు

వాఙ్మనోగోచరము కాని పరమ కార్య
కారణ మ్మేదొ మత్కృతి ప్రేరణమ్ము
ఫలమటందువ, యుగయుగ పరిమితముగ
త్వన్మదాత్మానుబంధమ్ము ఫలము రామ.

శ్రావ్యగానమ్ము తియతీపి కావ్యరసము
మొగము మొత్తని పానకమ్ములు ధరిత్రి
ఋతు విభేదము రుచిభేద మెంతయున్న
గెలిచి తీఱును ఘంటాసురులను గూడ.

ఇదె మాకన్యక గానమున్ వినిచి యాయామోద మందిచ్చు, న
య్యది వాసించెడి నారవిందుకమునై, యానందకందమ్మునై,
బ్రదుకుల్ దిద్దెడి నీతిశాస్త్రమయి, యాంధ్ర ప్రాభవామోదముల్
ప్రిదులం జేసెడి మంత్రమై, చెడని కల్మింగూర్చు నాదర్శమై.

శ్రీ కిరీట ప్రభాశ్రీలలోఁ గెంపునా
మురువైన చిన్ని మూపురము తోడ
కొసలుతేలి మొదళ్లు గుంటలై నిగుడు న
రంటి పూరేకు కర్ణములతోడ
చెయిమోప జాఱునో చెఱగునో నును పస
మిసమిసౌ దువ్వల్వ మేనితోడ
నెలవంకగా వంచి నిలిపిన నెఱి నల్ల
పట్టుకుచ్చుల తోకచుట్టుతోడ

అందచందాల తలపోల మైన కరువు
కడలఁ బొంకము లొత్తిన గండరువును
చికిలి కుంచియ పనిసేత చిత్తరువును
గాఁగఁ బొలిచిన యొక యావులేఁగదూడ.

మొల్కక గాలుల జగామొనగానిఁ గొని పోదు
నని వచ్చు హరిణవాహనము వోలె
భంగిమమ్ములు పట్టఁ గొంగుచెక్కి పసందు
గజ్జెగట్టిన యాటకత్తె వోలె
ప్రకృతి బాలుఁడు పందె మొకఁ డిచ్చి విసరిన
ధరణిపై కుఱుకు బొంగరము వోలె
కవిదృగంతానంతకాంతు లూఁగింప జెం
గటికి వచ్చిన చుక్కకన్నె వోలె

రవిపురమ్మున కవిగృహారామ సీమ [1]
సిగలఁ బలువన్నియల పూలచేరు లురలఁ
దుఱుముకొని యున్న మెట్టతామరపడంతు
లిడెడి యాకులగొడుగు నీడలకు వచ్చె.

జ్వలితాత్మీయకర ప్రచండతరవేషం బంత చాలించి, యు
జ్జ్వలనోత్తప్త వసుంధరాజనము నాశ్వాసించి, దిక్కాంత చె
క్కులపై కుంకుమపత్రభంగముల రేకుల్ తీర్చి క్రీడించి, ప
క్ష్మలముల్ మూసె సుషుప్తిమై యరుణుఁ డుచ్ఛ్వాసార్ద్రనిశ్వాసుఁడై.

పూలుపిండెలుఁ బఱపషు లోలి తొగరు
వెలుఁగు లొలసి పసిండి పూఁతలు గడించె
ఎగుడు దిగుడుల పుడమి వడ్డించి యిడిన
లేఁత బంగారు భుక్తిపళ్లెరముఁ బోలె.

నాటి నభస్సులో తళుకు నాఁచిన యా పసిదూడ యేటికో
కాటుకకంటి చూపులను గల్వలు క్రువ్వుచుఁ గాన్క వెట్టుచున్
గోటికి రాని నేలఁ గొనగోటికి దెచ్చుచు దూఁటి దాఁటుచున్
సూటిగఁ గావ్యసౌధమున సుందరనాయకుఁ బోలెఁ జొచ్చుచున్.

సింగారమ్ముల ప్రోవనంగ మెయిఁ గుంచించున్ సుమాళించుచున్
అంగప్రాభవ మొక్క కందుకముగా హత్తించుచున్ రమ్యసా
రంగమ్మట్టుల మేనితళ్కు లట ధారావాహముల్ సల్పుచున్
క్రుంగున్ పొంగును నేఁగు నాఁగు మఱి తగ్గున్ మ్రొగ్గు లీలాగతిన్.

పాణిని కందుక మ్మొకఁడు పట్టి శిశూత్తముఁ డా సమీప మం
దానసీమ లేనగవు లారగఁ బోసి మనోహరాంబు రే
ఖానవనీలముల్ తళుకు గన్ను కనీనికలందుఁ దీర్చి చేఁ
బూనిన కందుక మ్మెగయ బుచ్చెను మాతృకరాంజలిం బడన్.

## గో వ త్స ము

సూనానందమయ ప్రసన్నముఖ విస్ఫూర్తి ప్రకారోదితా
త్మానూనప్రవికాసభాసమతి ముయ్యానందముల్ నాఁచి మా
గాణిం బండిన స్వర్ణరేఖ లటు పుల్కల్ తోఁచి మై పొంగగా
పాణిం బట్టిన తల్లి కందుకము పోవం ద్రోచె పుత్రాంజలిన్.

తొగరుఁ బెడవుల తెలినవ్వు తోరణముల
నూయలల నూఁచు మాతాసుతోత్సుకతల
కత లనుక్షణేక్షణ మాలికల నలంక
రించి యానందమున బాలు పంచుకొంచు.

మలయాచలాగత మందానిల పరివా
రామోదమున దోఁగు లాడు వాఁడు
సంధ్యాంగనారుణాసమ సైకత విహార
గగనసీమను జూచి సొగయు వాఁడు
ప్రకృతిరాహస్య నిర్మల విమర్శనపరం
పరలలోఁ బుఱుగులు వాఱు వాఁడు
లీలాసమాహూత లిప్తానుభవకణా
కృతు లంది గ్రంథము లేలు వాఁడు

తాళపత్రకుటీర పద్మదళపీఠ
సుఖనివాస తన్మయతనుఁ జూఱువాఁడు
రసమయాత్మకు దోహద మ్మొసఁగువాఁడు
సుకవితా జీవనానంద సుందరుండు.

సమ్ముఖాంబకు నుపభోగ్యసముద మైన
తనయకేళీ విలాసమార్దవము నొకట
ఒక్కట బరోక్షగోమాత కొదవ నట్టి
గోకుమార వినోదము గొలిచి తలఁచె.

"తనయ సుహాసభాస రసతన్మయ హృన్మయ మాతృసన్నిధిన్
మొనసి ప్రదర్శనం బిడెడి ముగ్ధసుతప్రకర ప్రచారముల్
ప్రణయవియద్ధునీరసతరంగవిహారమనోహరార్ద్రిచే
తనపురపాళిలో విఱిసి తార్కొను మీఁగడ పాలవెన్నెలల్.

తనయ సుహాసభాస రసతన్మయ మాతృపరోక్షభూమియం
దెనసి ప్రదర్శనం బిడెడు నీదృశమైన కుమారు చెయ్దముల్
జనరహితోగ్ర దుష్టమృగ సంకుల సాంద్ర తరువ్రజావనీ
వనమున గాసి వ్యర్థ మగు పాత్రికల్ గల పండువెన్నెలల్

జగతియె తల్లిభావమగు సంస్థ, యిలాతలసృష్టి యేది మా
తృగణము లేక? యీ పెరుఁగు నేపున కూఁతయు నేది? సర్వభూ
తగణముఁ బొందు తత్ప్రణయతత్పరభావఫల మ్మదేదియో?
సుగణిత మూలసూత్ర మగుఁజూ! జననీత్వము భూతకోటికిన్.

రాజ్యమే లేని రాజు సామ్రాట్టులేని
యవని, సతి లేని పతి నిజధవుఁడు లేని
సతియు, ధర నున్న నుందురు; జనని లేక
తనయుఁ డాత్మజుఁడును లేక తల్లి లేరు.''

అని తలపోయుచుఁ గవి లో
చనయుగళము విచ్చి యరుణసంధ్యకు నీరా
జనము లొసంగెను మొన తే
లిన వెలుఁగుల కొసల భావలీన ముఖానన్.

కపిరికపిరిగఁ జిమ్మచీఁకటులు పర్వె
చిటుకు చిటుకున లేదూడ చెంగలించె
పొటుకుపొటుకున భావాలు పొడిచెఁ గవిని
ముం దెఱుంగని గోవత్సమునుఁ దలంప.

---

ఈ పుటలో 6. వ పంక్తి నిట్లు చదువుఁడు.

........సతిలేని పురుషుఁడు, ధవుఁడులేని
వనిత ............

“చీఁకటిపట్టుకోక కయిసేసిన దీ రజనీలలామ, యీ
కూఁకటి తర్ణక మ్మెవరి గోరమదో? ఎట మేపుఁ జిక్కెనో
రాకయె పోయె ధేను! విట రాగిలు చొక్కపుఁ గోడిగీఁడు తాఁ
బోకయె పోయె నాపొదుఁగు పొంగులు చేఁపెడి గుమ్మపాలకై.

పచ్చిక గీఱుకొంచు నిలు పట్టెనొ గో విటమున్నె? దుగ్ధసం
పచ్చయముల్ గొనఁ జషక వారియు బందము త్రాడు దెచ్చి వే
వచ్చియు నాలకొట్టమున వత్సముఁ గానక ముగ్ధభామ తా
నచ్చటె నిల్చి నీ రగుచు నాయనకుఁ విషయమ్ము దెల్పెనో?

అచ్చెరు వందు నెమ్మొగము నంగన నుండి తెమల్చి, నెమ్మదిం
గ్రొచ్చిన ముల్కుపల్కునకుఁ గ్రొత్తడి కుత్తర మైనఁ జెప్పకే,
వచ్చు గృహస్థుఁ డే వయిపుఁ బట్టెనొ కట్టను బొట్టుకొంచు? రా
వచ్చును గాదె యిప్పటికి? బాపము, దిక్కులు చించి చూచునో?

బుసబుసకొట్టు ముక్కుపుటముల్, దెసలొడ్డిన వాడికొమ్ము, లు
మ్మసు కొలఁదిన్ విదిర్చుతల, మంథరమై తలత్రాడు త్రిప్పుతో
దెసదెస పట్టి వాయువు మథించెడి మేను, శివమ్ము లెత్తి త్రొ
క్కిస లిడు కాళ్ళు నై, తొడుకు క్రేపునకై యెటు చుమ్మలందునో?

తోర మపారమౌ పొదుఁగుతో నరముల్ బిగఁబట్టి కొంత, యం
బారవ కంఠపాటనవు భారముచే నొకకొంత, మేధి వృ
త్తోరుభయంకరాటనరయోద్ధతిచే మఱికొంత, డీలుఁగా
నూరు మరుంగుతోఁ గపిల యుచ్ఛ్వసితమ్ములు పుచ్చుకుండునే?

చేఁపు పాల్దప్పు నెఱుఁగని చిన్నిలేఁగ
డొక్కచిఱుపొత్తియలు నింపు చక్కి యెటుల?
ప్రకృతి కెదురీఁది యఱువేని పరిభవిలునె?
వత్సమునె పంపి నెమకింతుఁ బాడిమొదవు."

అనుచుఁ గవీశ్వరుండు చెయి కందియు నందక త్రుళ్ళు వత్స రా
జునకునుఁ గ్రొత్తతాకు చవిచూపుచుఁ జేతులు రెండు ముంచు వె
న్కనుఁ గదియించి యెత్తుకొనినన్ నిలుపోపఁడ చిన్నిబొట్టె! తి
క్కని కవికౌఁగిటం బ్రకృతి కన్న కుమారునిఁ జూడఁ జక్కనౌ!

కను పొడిచికొన్నఁ గనరాని కాళరాత్రి
తద్గృహావరణారామతరణ సల్పి
వత్సమునుఁ జేతఁగొని ద్వారకవాట పార్శ్వ
ధరణితలమునఁ గవి డించె తర్ణకమును.

చిఱుదూడఁ మునుమున్న త్రోసికొనుచుం జేయెత్తి గద్దించుచున్
పఱుగుల్ వాఱెడి వత్సరాజు వెనుకం బల్మాఱు పర్వెత్తుచున్
తిరిగెన్ దిక్కులు ప్రేమపాశగణ బంధీభూత చేతస్కుఁడై
పౌఱిఁ గన్పించిన వారికిం దెలిపి 'యావుం జూచినారా?' యనున్.

దూడ యెంగిలిపాలు తుదిబొట్టు గీఱి తీ
సిన చనుల్ తప్పలు చేసి వదలి
పురుఁడు పుచ్చక ప్రాణములు పుచ్చు దూడల
తోలుబొమ్మలు నిల్పి పాలు తీసి
నీరగోక్షీరసంధినిఁ జేసి గర్భాతు
రార్భకార్థము కొల కరగఁ బోసి
శశికాంతమణిసౌధవశవర్తి యయ్యును
బశువర్తనాదిజీవనము విడక

ఇరుగడల మట్లు నిరుబిందె లొరగకుండఁ
గుదురుల న్నిల్పి, బుజమున నదరి యూఁగు
పాలకావడితో నిల్లుఁ బట్టి పోవు
కరుణరసమూర్తి గొల్లఁడు కానవచ్చె.

అతని నల్లంత దవ్వున నరసి సుకవి
"ఓయి నిలుమోయి! నిన్నె! గొల్లా! యి దేరి
దూడ, యెఱ్ఱది లేలేఁగ, చూడు మిదిగో!
పోదు వేమోయి? తొడుకుఁ జూపుదువె సుంత?

అనుచున్ గొల్లని వెంటనంటి పలుమా ఱా గాథ వాక్రువ్వ, నొ
నని కాదంచు వచింపకే "విడిచి పొండా! ఎందొ చానిండు, మీ
పనియా యావును దీనిఁ జేర్ప? శునకాల్ వాతం బడుంగాత" మం
చని పోయెన్ వెస నాలపాల బ్రదుకై యంతంత వాఁ డయ్యునున్.

కవిని గవీగవేషణ వికల్పము చెందిన ప్రేఁటుకన్ననున్
పొవరును రాతిగుండె గల మూర్ఖుడు పల్కిన వజ్రనిష్ఠుర
ప్రవహాము పోటకత్తి యయి వచ్చె హృదంతరనాళరక్తని
ర్వ్యవహితవాహినీనిచయభంగము లంగము నుచ్చి కోయఁగన్.

కవి నిరాశాగతాత్మనిగ్రహముఁ బూని
తొడుకుదూడ నింటికిఁ ద్రిప్పి త్రోయఁ దొడఁగె
కవికి నంబాస్వనం బొండు చెవినిఁ బడె జ
లప్రళయజీవి కగు తృణలవము భాతి.

అంభాధ్వానము చేసె లేఁగయు నమందానందసంధానుఁడై
స్తంభీభూతుఁడు తత్కవీశ్వరుఁడు చెంతన్ నిల్చెః రూపైన ది
వ్యాంభోరాశిగ దాపుదాపు నగు గో వచ్ఛప్రభావంతమై
'అంభా అంభ' యటంచు డగ్గఱెను వత్సాంగమ్ము మూచూచుచున్.

వత్సము వాల మెత్తుకొని పాలపొదుంగు చతుస్తనంబు న
త్యుత్సుకతన్ నిజాస్యమున నొయ్యన గుప్పినఁ గొమ్ము లొడ్డి గో
వత్సము మోమునున్ 'ఠపఠపా' యెగఁదన్నెను గోవు, పాప మా
వత్సము దీనదీన మయి ప్రక్కకుఁ బ్రక్కకుఁ దాఁటి తాఱుచున్.

ఎత్తినవాల మెత్తినటులే తిరిగెన్, జఠరాగ్ని పెల్లు రే
కెత్తిన డొక్కతోడ, దురదృష్టపు దృష్టులతోఁ, బిరాంబ కా
ళ్ళెత్తి పెఠీలునన్ విసరుచు నేపు ధరింపని సిగ్గుబుగ్గతో,
మొత్తిన మోముతోడ నొకమోస్తరు నుక్కిరిబిక్కి రై చనెన్.

అంత నంతరభావపరిహారదళిత
హృదయ మది వరియ్యగాఁ గవి యిట్లు తలఁచె
"పాప మయ్యది బిడ్డ కన్పడని గోవు
బళిబళీ! తల్లి గనరాని వత్స మిద్ది.

'చులకన జలరుహతంతువు
చులకన తృణకణము దూది చులకన సుమ్మీ
ఇల నెగయు ధూళి చులకన
చులకన మఱి తల్లిలేని సుతుఁడు కుమారా?'

అని పులినోటి కండ యయి త్యాగము సేయఁగఁ బోవు నావు వ
త్సను గని వీడుకొల్పిన వచ స్సిటఁజెల్లెఁ; దపస్సు సిద్ధి చెం
దిన కవి వాక్కు లోన జగతీస్థలి నిల్వదె? కొల్వు సేయదే?
మనుజుల కొండు నీ పశువుమాతల కొండునె ధర్మపన్నముల్?

ఒరులకుమారు లెట్టి సుగుణోజ్జ్వలభూషణు లైన, నెట్టి సుం
దరసుకుమారగాత్రులయినన్ స్వకురూపనికృష్టపుత్రవై
ఖరిఁ బ్రణయప్రసాదకరకమ్రతఁ జూపునె తల్లి? మాత లీ
వరుసయె కాకయున్న జనిభారము లోకము మోయఁ జాలునే?

అని రసముగ్ధమూర్తి హృదయమ్మున రేఁగిన దుఃఖదాహశో
షణమును ధర్మశీతజలసారములన్ శమియింపఁ జేసి కూ
రిన వగఁ గూడనీక యురరీకృతనేత్రజలమ్ము జాఱనీ
కను గనులాఁచి లోఁచుకొని క్రమ్మఱె నింటికి దూడతోడుతన్.

 ఇది ప్రథమపాదము

మెరిసిన చుక్కలంబరపు వీథులఁ దోరణ గట్టి వెల్గఁ బ్రా
క్స్వరుచిర భామినీ రచిత కోమల వారిధి డోల నూఁగుచున్
స్ఫుర దరుణేందు సుందరుఁడు పొల్చె నవోదయరేఖ దీర్చి సం
బరమున లోకముల్ కలువపాళి కరాళి నివాళి యెత్తఁగన్.

ఒడలెల్ల బంగారుతొడవుల తొడుగుతోఁ
దులతూఁగ సిరులోడు సొలపు వాఁడు
నీలమేఘచ్ఛాయ లేలు తళ్కుల మేనఁ
దెలి దువ్వలువ దుస్తు లొలయువాఁడు
సగము విచ్చిన వా కప్పిసవ గర్భమున నుండి
తియపల్కు తేనె లందించువాఁడు
కూఁకటి కురుల నొక్కులలోనఁ జీఁకటి
కుసుమముల్ విరఁబూచుకొన్నవాఁడు

# గోవత్సము

మూఁడు నాల్గేండ్ల వయసుతోఁ బొలుచువాఁడు
దారి తప్పిన యడలుమై తలఁకువాఁడు
పండువెన్నెల విరిపూత నిండి విరియ
వీథిలో నిల్చె దిగ్భ్రమావృతుఁడు వాఁడు.

తన్నొరుల్ గన్న యంతన నావు రని యేడ్చి
యమ్మేది చూపు మం చడిగి యడిగి
మున్నేరు గనరాక యున్న లోలో మ్రింగి
బిక్కు బిక్కున వెక్కి వెక్కి పొగిలి
పుణ్యకాంతలు చూడ్కిఁ బొలయ నమ్మా యంచుఁ
జని కొంగు కొనియుఁ గా దనుచుఁ దొలఁగి
కనువిచ్చి మున్నీరు కన్నీరుగాఁ బుచ్చి
మొగము జేవురు ఏటి ముంపుఁ జేసి

చిన్ని గుప్పిళ్ళు వెనుద్రిప్పి కన్నుగవను
నులుముకొంచు నెడ నెడ గాళులు విదిర్చి
బూరటించిన కడుపయి యూరటించి
అమ్మ అమ్మా యటం చాతఁ డావులింప.

ఒక వయిపు నుండి చనుదేఱె నొక్క నఱ్ఱ
మఱొక దెసఁ బట్టి యేతెంచె మఱొక నఱ్ఱ
ఎదురుకోలలు కొనిన యా యిరువృషములు
బుసబుసలు కొట్టి ముకుపుటముల్ చలింప.

కొమ్ముల్ కోరఁగ బోరగించి, చెవినిక్కుల్ తీర్చి, పైకెత్తి వా
లమ్ముల్ వంచి, ఖురమ్ములం బృథివి పెల్చన్ దువ్వి, దేహోలు దీ
ప్రమ్ముల్ చేసి, భయావహంపు ముఖదర్పం బొప్ప వెన్వెన్క కు
గ్రమ్ముల్ దేహము లొత్తుకొంచుఁ జనెఁ దోరమ్మైన రోషమ్మునన్.

రంతుల్ సేసెడి యా వృషాధిపతు లోరంజూపులం జిమ్మి, యే
కాంతం బందున లేఁతవ్రేళ్ళదుముచుం గన్మూసి రోదించు తత్
భ్రాంతున్ మధ్యగతుం గణింపకయ, శౌర్యప్రాభవోపేతది
గ్దంతుల్ రేఁగిన భంగిఁ దారసిలి యూఁగంజొచ్చె మున్వెన్కలన్.

ఇటు చూచినఁ బసరము, తా
నటు గాంచినఁ బసరమే, భయంకరదృశ్యా,
మ్మటు చని యిటు చని బాలుఁడు
కటకట పడసాగె భయవికంపితతనుఁడై.

# గోవత్సము

వయసుంబెద్ద, నిరంతకావ్యపఠన ప్రారంభసంరంభి, య
వ్యయ పౌరాణ కథాధికారి, యతి దీవ్యద్వేద శాస్త్రార్థని
ర్భయ పాండిత్య నిరంకుశుండు, కవిమిత్రప్రోల్లసద్భావని
శ్చయకల్పుం డొక బ్రాహ్మణప్రవరుఁ డిచ్ఛామార్గుఁడై పోవుచున్.

వృషభరాజద్వయీ రూక్షవీక్షణాగ్ని
మధ్య దందహ్యమాన కుమారు, రమ్య
రూప లావణ్య మార్ద వార్ధ్రిని, హఠాద్దృ
గంచలమ్ముల యాదృచ్ఛగతినిఁ జూచె.

చూచినతోనె దద్దరిలుచుం జని యజ్ఞహవిస్స్వధాపవి
త్రోచితహస్తపద్మమున నొయ్యన నా సుకుమారుఁబట్టి కే
లూఁచి విదిల్చి లాగె సమయోచిత సాహససంభ్రమమ్ము లు
ట్టూఁచిన విప్రుఁ, డర్భకున కూఱిన ముచ్చెమటల్ శమింపఁగన్.

మూర్తీభవ దార్తావనుఁ
డార్తవపుంబువ్వు బాలు నరయుచుఁ బ్రణయా
వర్తిత హృదయాందోళన
నర్తింపగఁ బృచ్ఛఁజేసె నానాగతులన్.

అమ్మ పేరేమి చెపుమన్న అమ్మ యనును
అయ్య పేరేమిరా యన్న అయ్య యనును
ఊరుపే రే మటన్న మా యూర టనును
పాప మా పాపఁ డెవ్వని బాలకుండో!

ఏయది పోల్చలేక, యొడలెల్ల నగల్ గల బిడ్డ, నోరునున్
వాయియు లేని యా చిఱుత ప్రాయపుఁ గుఱ్ఱను, రాత్రమందుఁ బోఁ
ద్రోయఁగలేక, తాఁ గరుణతోయధి నీదఁగలేక, బాలుఁ డా
రేయిఁ గవీశు నింట నిదురించుట సేమ మటంచుఁ గొంచుఁ బోన్.

ఉచిత నమస్క్రియాగత బహూకరణమ్ము నిజప్రథావిధా
రచితముఁ గాఁగ సల్పి, కవిరాయఁడు శాస్త్రవిశారదుండునున్
విచికిలదృక్కులందుఁ గరవీరపు మోవిరుచుల్ లగించి, తత్
ప్రచురిత హాసమాలలఁ బరస్పర గౌరవ మామతించినన్.

తన వెంటం గొనివచ్చు నర్భకునిఁ జేతందట్టి ముందీసి శా
స్త్రనయోపాయుఁడు "వీనిఁ జూచితిరె? యేతద్గాఢ నైశీధవే
ళను వీధింబడెఁ జావుదప్పి యసువుల్ దక్కెన్, కటా! వీనికిన్
జనకుం డెవ్వఁడో వాసమెయ్యదియొ తోఁచంబోదు, తాఁ దెల్పడున్

తఱుగుకొని పోవు కడుపు చింతాభరాన;
చనక తప్పదు తెలవాఱు జాము లేచి:
కొనఁగ రా దీతఁ డీ ప్రాంతమున సుతుండు;
భరము నీదయ్యె, బిడ్డఁ గాపాడి యిమ్ము.

కన్నవారలు దైవయోగమునఁ జేసి
వచ్చినం దప్ప నీ రేయి పుచ్చుకొలుల
నిలువు టపరంజి తొడవు లన్నిటినిఁ గాచి?
పున్నెమని పోవఁ బాపమ్ము పొంచివచ్చు.

పదియార్వన్నె పసిండిమేలినగ లుద్భాసించు మై నెల్ల, ని
య్యదె కన్గో పులిగోరు కంఠమున, నీ హస్తమ్ములం గంకణా
స్పదముల్, తత్కటిసీమ వెండిచిఱుమువ్వల్ మ్రోయుత్రాడొప్పు ని
య్యదిగో! హారము మూఁడుపేటలును హేమాసాదితౌజ్జ్వల్యముల్

చేయని మోషకత్వము వచింపని యట్టి యబద్ధ మీవు నే
మోయఁగ నౌనొ యేమొ? ధనముల్ బహుపాపఫలాలు, లోకమున్
మూయఁగ మూకు డున్నదె? కనుల్ గలవే? చెవులున్న, వీ జగ
న్మాయ దివాంధ. మున్నది కనం జన, దుండని దున్న దం చనుక్

అను శాస్త్రజ్ఞుని పల్కు లర్థములు కా కై నట్టులే యుంటచేఁ
దన మాటే యని బాలుఁడున్ దెలిసి చిత్తమ్మందుఁ జిత్రమ్ము రూ
పునఁ దల్లిం గని శోకవార్నిధి మనఃపూరమ్ము గావించి బో
రున నమ్మా యని బాష్పముల్ కుఱిసె నాక్రోశించి కుయ్యోట్టుచున్.

అమ్మా యన్న కుమారు శోకమకుట మ్మాపాదమస్తమ్ముగా
గ్రమ్మెన్ కొమ్మయి సూచికాంకురగతిన్ గ్రుచ్చెన్ మఱిన్ వాడిబ
ల్లెమ్మె గాడి పౌనర్బౌఁ దత్కవిమెయిన్ ; లేమావి కొమ్మెక్కి శాం
తమ్ముల్ గీతము లాలపించు కలకంఠమ్మది సైరించునే?

కవి కితఃపూర్వగోవత్సగాథ, కిక్కు
మారకథ గోరుచుట్టుపై మర్దనమ్ము
అది కవికె బాధ, యా వత్స మెది యెఱుంగ
దిదియొ యిరువైపు మొనకత్తి యిరుకుకోఁత.

“ఏకదుర్దశాభాగము లిట లగించి
యీ కథాద్వయి నొకటఁ బ్రిభూకరించె
దైవ మెంత మాయావి? పాత్రములు వేఱు
రస మొకటె సుమ్ము, ధ్వనివిచిత్ర మ్మదేమొ?”

అంచుఁ గవి యర్భకుని కన్ను లల్ల దుడిచి
చుంచు దువ్వి శిరమ్ము మూర్కొంచుఁ జెదరి
మొగమునన్ మూఁగు తడిపొడి ముంగురులను
దిద్ది చుబుకమ్ము పుణికి చే ముద్దుఁగొనుచు.

అమ్మ వచ్చునులే భయమ్ములే దయ్యా యం
గడి కేఁగె వచ్చులే గడియలోనె
బంతి చూడుమ తన్ను భరియింప దిట్టన్న
నేలను దన్ని పల్టీలు గొట్టు
పాఁపఁ గన్గొను మేడ్వ నోపదే నినుఁ బోలె
కీ యీయఁ జిఱుమువ్వ మ్రోయ నూఁగు
ఎంత చక్కనిది రైలెక్కి పోదువ యిన్ప
పట్టాలు లేక దివ్యముగఁ బోవు

అనుచు బంతుల బొమ్మల నతని కిచ్చి
కవియు నర్భకుఁడై యర్భక ప్రసంగ
సంగతాపాంగ లోక నాసాదిత ప్ర
మోద భరితుండుఁ గా మాఱిపోయెఁగాని

తుంగ భంగ నట న్నదీ సంగమమున
నోరుఁ దెఱచి యార్భటి నూఁగి పాఱు సాగ
రాగమము వోలెఁ గవికృత రాగలాల
నాదులన్ బాలు శోక మత్యంతమయ్యె.

పృథివి పెళ పెళ పగిలిచ్చి పెకలి వెడలు
తత్సరస్వతి వోలె నంతస్తరంగ
శోకవాహిని యుబికి వీచులను బొంగె.
అణఁగునే యంతరాంతర వ్యాకులములు?

అనిలుఁడు బాలుఁ జూచి నిలు పాపని జాలినిఁ బోయి కందళిం
చిన పువుఁదేనె విచ్చు విరిచేడెల చెక్కులు నొక్కితెచ్చి పో
సిన దగ దీఱ దుమ్మగిలు చిత్తము చెమ్మగిలంగ బోద, రె
చ్చిన సుతరోదనన్ సమయఁజేయు నె మాతవినా ప్రపంచమున్?

వెలకిలఁ బండి తొమ్మొలయ సెజ్జఁగఁ జేసి
యూఁగి హాయిఁగ నిద్ర నొసఁగు తల్లి
ఏదొ యనిర్వచనీయ హిమకర స్పర్శమై
మెలయించుఁ జేసోకు నిచ్చు తల్లి

చిఱుగడ్డము బుజాన నరమోపి కనుమూయు
తన్ను గాలికిఁ ద్రిప్పి తనువు తల్లి
మధురగీతము లొత్తి మకరందమును జార్చి
తన్మయానందమ్ముఁ దార్చు తల్లి

కానరామిని నతఁడు బెంగపడిపోయె
కునుకుఁ జొరదెంత వేళ మించిననుగాని
తినఁడు మేతు కెంత బుజ్జగించినను గాని
కన్నతల్లికి సాటి స్వర్గమ్ము గలదె?

ఎఱియు మనమును దనువు శోషిల్లి తుదకు
కుట్టుఁ డించుక కునికి తా గుబ్బు వెట్టె
అంబ లేని వారలకు నిద్రాంబ యంబ
ఆధిబాధల మందు నిద్రాంబ పొందు.

జ్యోత్స్నాక్షీరలసత్తరంగ నిచయ జ్యోతిష్పయోరాశి దీ
వ్యత్స్నిగ్ధాంబరనీలశయ్య నిదురింపఁ బాలుఁ డొప్పారె ను
ద్యత్స్నిగ్ధాచ్ఛ సుధాపయోధి వటపత్రంబందు నిద్రించు భా
స్వత్స్నేహ ప్రథమావతార మగు గోపశ్రేష్ఠు చందమ్మునన్.

 ఇది ద్వితీయపాదము

కేళీ మహానంద లోలాత్మ గోపాల
బాలాకృత నవాంబుదాళి యొకట
పూర్వగ తాంబుద పోత జాలా న్వేష
గమన కాదంబినీ కాంత లొకట
వివిధ నర్తన కళా విన్యాస సక్త గో
వత్స రూపాంబు దార్భకు లొకంట
అతిభార దుగ్ధస్తనావళీ నేత్ర ప
ర్యాకార గోనీరదాళి యొకట

పొడమి, యొకటిఁగ మూఁగఁగ, నెడ నెడ నెడ
మెఱుఁగు దీవ యొకం డటఁ దుఱఁగలించె
ఏ నిరాశాగతాత్మున కేని బ్రదుకు
తీపు లూరింప నొక యాస ప్రాపు చాలు.

# గోవత్సము

బాలారుణాంగప్రభా తర్ణకముతోడ
నాటాడె నిటమున్న యన్నవాడు
కుప్పించి యెగసెడి గోవత్సమును బట్టి
వెన్నాడఁ జూచితి మన్నవారు
కంఠహారా ద్యలంకారాలతోఁ గంటి
మటుపైనఁ దెలియ దంచనెడివారు
ఇంతదన్కను నాడె నేమాయె విసుమాన
మనుచు ముక్కుల వ్రేళ్ళ నదుమువారు

ఇరుగు పొరుగుల గృహిణులు నిరువయిపుల
బలసి చనుదేఱ యట నట నిలిచి జాఱ
దారితప్పిన కొడుకుఁ బుత్తేఱఁగోరి
ఎఱియు మనమున నొక కాంత యేగుదేఱుం

సుడివెట్టి మొగము బ్రుంగుడు పోవఁ దూరు పో
తను బటు ధూళికిఁ దనక బోక
ప్రతి నిమేషము మేఘతతి యాకసము మూయఁ
గవియు చీఁకటి చూచి యవియబోక

వర్షసూచక శీతపవన ప్రచారమ్ము
గని వాన రాకకై వణకఁ బోక
కాఱుచీఁకటి బయల్ దేఱి యిల్వెడి పో
కకుఁ గొంకు నిసుమంత గనఁగఁ బోక

మంచిచెడ్డలు మునువెన్క లెంచఁబోక
ఒడలు తెలియని యావేశ మొత్తఁబోక
పేలికలఁ బోలి కాళులు తేలిపోయి
మెలికవడి యడ్డదిడ్డము లొలసి యూఁగ.

భూపరాగము సోఁకఁ బొదలి జాఱిన కుచ్చె
ళులు నేల జీరాడ మలఁచు కొనుచు
అదరెడి పాలిండ్లు వదలి గాలిపటమ్ము
చెందు కొంగును ద్రిప్పి చెక్కికొనుచు
ఎడనెడ ముడి వీడి విడిలిన నెఱివెంద్రు
కలకొప్పు దడదడ ముడిచికొనుచు
మెయికొన్న సంభ్రమ మ్మెయిదిన చూపు తు
న్కలు దెసదెసఁ గ్రమ్మఁ దెలుచుకొనుచు

మాతృతాభావ చకితాత్మ మానసమ్మ
పట్టియిచ్చెడి మూర్తినాఁ బరిఢవిల్లి
వీథి వీథుల బడిబడి వెట్టివోలె
జామురాతిరివేళ రాసాగె నామె.

నికట తాళీమౌళి నికర నిస్వనములోఁ
దన బిడ్డ రోదనమ్మును గ్రహించు
నిజపురోభాగ మండితమైన 'మైలు రా
తి'నిఁ గాంచి సుత రూప మని భ్రమించు
సన్నిహితాయాత జనపద వ్యవధిలోఁ
దన సూను పరుగు శబ్దము తలంచు
ప్రచురి తాండజజాల కిచకిచారవములోఁ
దన కుమారుని పల్కులను బఠించు

మనసు కడుచెడ్డది సుమన్న! మంచి చెడుగు
గాఁగఁ దోఁచును, నుపపత్తి కనఁగ నీదు
ఆత్మజాన్వేషణార్థప్రయాణ యామె
బయటి లోకానఁ దనలోని భావ మేలు.

తత విచారాంధకార కేతాదృశమ్ము
తలఁప నానందజీవికిఁ దాదృశమ్ము
ఈ జగద్గమనమ్ము, భావించు జనము
సాధనమ్మును బట్టి సాక్షాత్కరించు.

వడివడి వెంటం బఱతెం
చెడి భర్తను గాంచి కడుపు చెఱువయి యడలుం
బడు పడతియు నెడరున మం
డెడి చిచ్చును నార్పలేక డిల్లం బడుచున్,

"బాపనసామి యే మడిగె? వత్సముఁ జూపినవేళ బాలునిం
జూపక యెవ్వఁడీతఁడనుచున్ నినుఁ బృచ్ఛ యొనర్ప కుండఁబో
బాపన యయ్యకున్ నగలపైఁగల మక్కువయేమొ కారణం ?
బా పసిదూడ వెంటఁ బడినట్టి కుమారుఁడు తోడఁ జిక్కఁడో?

పాపపుసొమ్ము లేమయిన బాలుఁడు నిల్చినఁ జాలు, నా నగల్
రేపిన దుష్టభావమున, రేయి గదా యని బాలు కంఠమున్
బాపఁడు నుల్మెనో! యతని పజ్జకు వత్సము పోవు మున్నె యే
పాపులు మండనమ్ములకు బాలునిఁ బొట్టను బెట్టు కేగిరో ?

వాయువే గాత్మ దుర్వార గర్వాధార
గమన వాహనము చక్రముల వలన
శిక్షితాశిక్షిత లక్షణానుభవ తు
రంగ ఖుర ప్రదారణము వలన
గర్జా వినిర్జిత పర్జన్య నిర్ఘోష
వృషభేంద్ర శృంగాగ్ర వృత్తి వలన
విషపూర్ణ దశనాగ్ర వితథాకృత ప్రాణి
సముదయ లేలిహానముల వలన

దుర్మరణ యోగ్యుఁడయ్యెనో ? తొలఁగలేఁడు
పరుగుఁ గొనలేఁడు, రక్షణ నెఱుఁగలేఁడు
శరణు గోరఁగలేఁడు నా చిఱుత బాబు
ఈ నిశీథాన నెటఁ జూతు ? నేమి సేతు ?"

అనుచుఁ గుమారిలంగఁ దన యంగన డగ్గఱి భర్త చేతులం
గనుకనిఁ బట్టుకొంచును మొగమ్మున మూఁగిన శీర్ణకేశముల్
వెనుకకుఁ ద్రోచి ఘర్మజలబిందువు లూఱిన మోము వల్వముం
గొనఁ దడియార్చి సందిటను గ్రుచ్చియు గ్రుచ్చక యూఁతనిచ్చుచున్

"ఎంతటి బేలవే! కొమరుఁ డేమయినాఁడు? గవీకుమారు న
ల్లంతన దోలుకొంచుఁ జనినట్టి కుమారుఁడు 'చచ్చెచచ్చె'నం
చింత వెడంగు పల్కులు వచించెదు, చించెద వాకసమ్ము, నే
నింతనె దెత్తు, నింటిదెస నేగుమ, నవ్వుదు రేరు విన్ననున్".

అనుచున్ సాంత్వనముం బొనర్చు పతివాక్య మ్మౌషధప్రాయమై
పొనుగుం బడ్డ హృదంతరమ్మున నెటో పోటంత రానీక, పొం
గినపాలన్ జలబిందువుల్ విద్రుచుభంగిం గొంత శాంతించె; నా
తనయుం గౌఁగిలిఁజేర్చుదన్క నెటు స్వాస్థ్యం బందుఁ దచ్చిత్తమున్

సుకుమార కౌమార సుందరాస్య ప్రభా
పరివేషములు కంటిపాప నాడ
నిరతమహానందకర పుత్రవాఙ్మయ
మధుకోశములు కర్ణపథము నింప
సరసకేళీలోలసమయాత్మజాలేఖ్య
రసమూర్తి హృదయదర్పణము నింప
నిజపుత్ర పదకింకిణీ నిక్వణక్వణా
రంభముల్ శ్రవణ పర్వములు గాఁగ

దీనదీనాస్య గనె దివ్యదృష్టి, కనని
తన కుమారుని రూపు చెయ్దిములు కనుట
భర్తృమూర్తియు నతని సాంత్వనమయోక్తి
కనుచు వినుచునె కనకను వినకపోయె.

వ్రజపాలకాంత యీగతి
గుజగుజతో రవిపురమునకుం జని నిలువఁ
వ్రజపాలుఁ డొక కుటీరము
నిజపత్నికి వ్రేలఁ జూపి నెమ్మదికెక్కఁ.

"అదియే బాపనసామి యిల్లిచటనే యాతండు పృచ్ఛించె; నె
య్యదియున్ సద్దిట లేద! యాయనయు నిద్రింబావళుండేమొ ? ఎ
య్యది మార్గ? మ్మటకేఁగి వే పిలుతునా యాయయ్య, రార" మ్మటం
చుదరుం గొంచు గృహాంగణాభిముఖయానోద్యోగసంరంభి గాఁ,

హారార్థమై దొంగ లదుమఁ గాంతా కంఠ
మునునుండి వచ్చు నిస్వనము వోలె
అదటుమై నరులు పైఁ బొదివినఁ బనవు దీ
నుని రుద్ధగళ రావమునకు బోలె

గ్రుక్క త్రిప్పుకొనంగఁ గుదరని శ్వాస కా
సపు రోగి నిశ్వాస సరణి వోలె
మరణ దశావేశ భరితమానవ గుర్గు
ర విశేష దుర్భర రవము వోలె

అరయ నిదమిత్థ మని తేల్ప నసువు గాక
ఒకట వినవచ్చె రవ మొండు నికటభూమి
సుతుని వెదకుచు నవహిత సూక్ష్మకర్ణ
యుగళమును దోరఁబెట్టిన యువిద కపుడు

కనుకని వెనుకనుఁ జను భ
ర్తనుగని నెఱి విఱిగి విరియు తలకుం జూపుం
గనులను నులివెచ్చని నీ
టినిఁ జిమ్ముచు గరిత యెడఁద డీల్పడి పలికెన్.

"అదిగో యారావము విను
మదె యేతత్ప్రాంత భూములందుం బొడమెన్
అదిగో వినువిను రార
మ్మదె పోల్చుము, వినవ అదిగొ అదిగో అటనే!

రా-రా-రా-రా" యనుచున్
భారమ్మగు కాళ్ళు సాగుబాఱిచికొని వే
వే రభసక్రియ రావ
ప్రారంభముగూర్చి చరచరా యడుగిడుచున్.

"ఎక్కడి సుతుఁ? డెక్కడి బ్రిదు?
కిక్కయి నాతండ్రి కంఠవృత్తిని బోలున్
దిక్కఱి చోరుల బాఱిం
జిక్కెనొ? యిమ్మెఱిఁగి రక్ష సేయంగదవే!

ఒక్కఁడె నా కులాంకురము, నొక్కఁడె నా యిలువెల్గు, లేకలే
కొక్కఁడె జీవనప్రసవ మూడని క్రొందొడిమమ్మ, నొక్కఁడే
యొక్కఁడె నాకు సర్వమును, నొక్కఁడుకాఁడు సహస్రిమూర్తి, నా
చక్కని తండ్రి నన్విడిన జావన? నాబ్రిదుకేల కాల్పనా?

బిడ్డ విపద్దశాముఖుఁడు బెగ్గిలి గగ్గురుపాటుచెంది చే
ద్పడ్డ మొగమ్మునం గటకటా తనుఁగూర్చి నిరాశుఁడై కరం
బొడ్డుచు నంజలుల్ మొగిచి ఓ యని యమ్మరొ రమ్మటంచు నా
బిడ్డ ననుం దలంచి విలపించెడి రావమొయేమొ! రాగదే!

చూపుము చూపు నాకు నీల సుందరగాత్రిని చిన్నినాన్న నా
చూపుల పంటఁ జూడఁదగు చొప్పెది చెప్పుము రమ్మ రమ్మ! యే.
పాపము పండెనో నగలు వానికి మృత్యుకరమ్ము లయ్యె, న
న్నాపకు నిల్వనోప నుయియైనను గొయ్యియినన్ ననున్ గొనున్:

మడిసెద"నని తడబడుచున్
వడకెడు నెన్నడుము నూర్పు వడ తాకి తడిం
బొడి చేసిన విడియపు తెల
గడి పెదవులు గాఁగ భయము గదిరిన మనసై

కందిన చెక్కు లెఱ్ఱందన మ్మూను కం
దోయి కెంజాయతో ద్యోతిలంగ,
డిందిన మోము క్రిమ్ముందేఱు ముంగురుల్
పొగకప్పుచాయ పైపూఁత వెట్ట
సంతత స్విన్న బాష్ప స్రవంతీ మహా
కల్లోలములు వెల్ల వెల్లిఁ బాఱ
కటిసీమ డిగి భుజంగమ పుచ్ఛనిభములై
కేశపాశములు వక్రించి జార

హస్త కంకణ నిచయ ప్రశస్త నినద
మాత్మరోదన వైపంచికారవమున
శ్రుతిని గలుపఁగ నూఁగుచు సొమ్మసిలుచు
బడుచు లేచుచుఁ గళవళపడుచుఁ జనుచు.

అడు గొకామడగా నయి యాత్మ సుత వ
శాత్మయై పోవు నతివ వెన్నాడి యతఁడు
రావ మేతెంచు దెసపట్టి పోవువాఁడు
కవిగృహావరణోపాంతకమున నాఁగె.

రౌద్రావేగముఁ జేసి కంపము శరీర మ్మెల్ల ముదిరింప, ని
ర్నిదోద్రిక్త భుజావలేపన మహోర్మిప్రాభవం బొప్పఁ దత్
భద్రాకారుఁడు పిచ్చలించి బలభద్రాకారుఁడై "చూడు మీ
ఛిద్రబ్రాహ్మణు మత్సుతాసుహరు భంజింతుం బ్రదారించెదన్."

అని యుగ్రాకృతిఁ బౌరుష
మున నారామమ్ముఁజొచ్చి మున్కొని వేగ
మ్మున నా యీ మూలలు చూ
చిన నొక్కెడ నతని కనులు చెదరెడి భంగిన్.

కహకహార్భటి భయంకర కంఠ సంరావ
భేరీ మృదంగ దిగ్గారణములు
క్రకచ ధారా దంత వికట కోటీ మధ్య
వేల్లిత జిహ్వాగ్ర వీచికలును
అరుణ హరి న్నీల హారాంక దేహోన్న
తాకార జిత పుండరీకములును
విధుర మాంసాహార పృథుల సంపాదన
వ్యాపార దక్ష హర్యక్షములును

దూరదూర స్థలాఘ్రాణ ధూర్వహములు
దూరదూర స్వనాకర్ణ నోరగములు
దూరదూర కృతానేక చోరగములు
జాగిలమ్ములు రెండావులేఁగఁ బట్టె.

భ్రమయో మాయయొ యంచు డగ్గఱుచు గోపాలుండు లక్షింప ది
గ్భ్రమముం గొల్పెడి రీతిఁ దొంటె నొకఁడుగ్ర కంఠోపకంఠ ప్రదే
శము నొక్కండును గాఁగ వత్సమును నిచ్ఛామార్గ రౌద్రాంక భై
రవముల్ పట్టెను దండశూక దశ నోగ్ర వ్యాఘ్ర దంతంబులన్.

చోరగ్రస్త కుమార వ
రారావ భ్రమను నఱిముత్తై తొడిఁదొడిఁ గ
వ్యారామసీమఁ జొచ్చిన
యా రామకు దిగులు దిగెను నసువులు నిలిచెఁ.

చిటిపొటి చిటపట చిటపట్లై యటనటఁ
దుటుములు తుటుములు పెటిలి పెటిలి
ఇట జాఱి యట జాఱి యెటుచన కటునిటుఁ
జిదుర్పలై చిద్రుపలై చెదరి చెదరి
రివురివ్వు కవుకవ్వు రేఁగు ఝుంఝూమరు
తృణకణంబుల నాట్య గృహాము సొచ్చి
ఆశాంతముఖవిహారాసారధారాళి
వసుధాంగ నోత్తప్తవపువుఁదేర్చి

దక్షిణమ్ముగ బయలు ప్రదక్షిణించి
రవి పురమ్మున నల్దెసల్ ప్రహరి చుట్టి
శీతాలామృతసార ప్రసిద్ధపురుషుఁ
డేమి యారాణ కుంభమ్ము లెత్తి కురిసెఁ.

'ఆ లేఁగన్ దురుసాడి పోతిఁ గొమరుం డట్లయ్యె' నన్ బాధయో!
'ఆ లేఁగన్ ఖనకాలు చీల్చునని పో నట్లయ్యె'నన్ వేదనో!
'ఆ లేఁగన్ బ్రదికింప నాత్మసుతుఁ డట్లై వచ్చు' నన్ గోర్కయో!
'ఔలే! ప్రాణ మెదేని యొక్క టను దివ్యజ్ఞానమో! నాల్గనో!
తలచగు కణువుల చేగ
జ్జీరుగేల నమర్చి పిడికిలించి యొడుపుమై
ఒరగుగఁ బట్టుచు వ్రేఁడొక
ఖరమగు బ్రేటొక్క భైరవమ్మును వేసెన్.

బలవంతమ్మగు వ్రేఁతబడ్డ యది గోవత్సమ్మునుం బుచ్చి ని
ప్పులుగాఁ గన్నులమర్షముం జెఱఁగ బౌష్ బౌష్ రావముంజేసి రూ
క్షలయవ్యగ్ర మహోగ్ర శూల సమదంష్ట్రల్ విప్పి కవ్వించి తోన్
మలఁగెన్ వత్సముఁబట్ట గో మధుర మాంసప్రీతి త న్నీడ్వఁగన్.

మఱియొక పరి గొల్లఁడు క
ఱ్ఱొరగుఁగఁ బైకెత్తి భైరవోగ్రద్వయమున్
జఱచిన నవి వత్సము విడె
వెర 'దండం దశగుణం భవే' త్తనఁ - గానీ.

గో వ త్స ము

---

చుఱుకు తిని రేఁగు సింగము
లిరుగడ గర్జిల్లి కోర లిఱియించుచు వేఁ
టరిపైఁ బడుగతి వెనుకొని
యుఱికెను వ్రేనిపయి నవి మహోర్జిత ఫణితిన్.

గిరగిర కళ్ళు ద్రిప్పి పయికిన్ బయికిం జొరబాఱి సాములోఁ
దిరిగినచేయి గొల్లఁడతితీవ్రకరభ్రమితాత్మయష్టియై
పోరి నఱువుళ్ల సేసె నరమున్ నరమున్ బొమికల్ నులించి; ది
క్కుఱి వెర తోఁకలన్ ముడచి యా నెఱ జాగిలముల్ దెసల్ గొనెన్.

తప్పిజాఱిన మృత్యువక్త్రమ్ము కండ
సారమేయోగ్రముఖ సముద్గారితాంగ
మావులేదూడ పెనుమూర్ఛ నవని నొరఁగెఁ;
దిట్టినయతండె ప్రాణముల్ తెచ్చియిచ్చె.

వ్రేలంజేసిన కంఠసీమయును బృథ్వీరేణు లిప్తాంగమున్
తేలన్ వేసిన కంటిగుడ్డులు మఱిన్ దీనాతిదీనాస్యమున్
లాలం గార్చెడి నోరు కొంకిరిఁగ వ్రేలంజన్న తద్వాలమున్
లీలం జూచిన గొల్లమానవుఁడు జాలిందూలె నాలేఁగకై.

కదలియుఁ గదలక వసుధను
నొదిగిన యా మొదవులేఁగ నొయనొయ్యనఁ జేఁ
గదుపుచు నుదకముఁ జల్లుచు
బొదలెడి పసుగాటు గాయములను గడుగుచున్.

సేవాప్రోత్సహమాణబుద్ధియయి రాశీభూతవిశ్వప్రజా
సేవాసంపదగాఁగ నిష్ఠ యయి వాసించెన్ దయాహీనహృత్
గ్రావాకల్పితరూపమై బ్రదుకు నా రాబొమ్మ;కాలప్రభా
శ్రీ వైలక్ష్యముగాక మానవపథిశ్రీన్ ద్రిప్పునే యెయ్యదేన్?

ఇది తృతీయపాదము

గోపిక యెల్గు డిందఁ బయికొన్న మహాతురతం గవీశ్వరున్
లేపెను, లేచె శాస్త్రియుఁ, జలించు శరీరముతో భ్రమించు కం
జూపులతోఁ బ్రతీక్షణత చూడిన బీటలు వడ్డ మోముతోఁ
బ్రాపిత గద్గద స్వర భరమ్మున గోపి కవీశుఁ జూచుచున్.

"సామీ ! దండము, మత్సుతుం డిటకు గోవత్సమ్ముతో వచ్చెనా ?
సామీచీనహృదిం గుమారు నిచటన్ స్వాధీనమం దుంచితో?
ఏమీ ! పల్కవు? పైడిభూషల మహాహిం దార్చి తో నంపితిన్
స్వామీ ! పున్నెము నీకు, నీ కడుపునం బ్రాపింతుఁ జెప్పంగదే !"

అనుచు నడలుపెంపున నెల్గు వణకు కొంత
వీచు నీదర చలిగాలి వెల్లి పాటి
వడవడఁ గుదుల్పు మెయికొన్న వణకు కొంత
ఇచ్చవచ్చిన గతినిఁ ద న్నేడిపింప.

పలుకు పలుకున నర్థమ్ము తెలియలేక
భావ విస్ఫురణార్థ శబ్దములు రాక
ఉక్తిఁ బునరుక్తిఁ జేసి త్యక్తోక్తి త్యక్త
ముగఁ బొనర్చుచు వేత్ర యేమో వచించె.

వెనుక నిలిచిన గోపాలుఁ గనుచుఁ బోల్చి,
సుకవితా సుందరుఁడు, నిల్వు చూఱగొన్న
దైవ ఘటనా చమత్కార తన్మయతను
దీప్తుఁడై కన్నుమొగిచి చింతింపఁదొడఁగి.

"మాత యెడైన గోసుతునిమాటఁ దలంపని గొల్లవాని కీ
చేఁత యిదేమి ? తత్సుతుఁడు చిక్కెను హా మ్మెటా శాస్త్రి కాతఁడీ
లేఁత కుమారు నిందునుచు లీల యిదేమి ? వ్రజాధిపుండు నా
చేత హితోక్తు లంద నిటఁ జేరుట యే?" మని మౌన మూనఁగన్.

అలసతకు నోడి గొల్లఁ "డయ్యా! యిదేమి ?
ప్రశ్నమున కుత్తరం బీవు ? భావవశతఁ
గనులు మోడ్చెదు ? గోసుతు ననుగమించు
సుతుఁడు చిక్కక వత్స మేగతినిఁ జిక్కె."

అని మహాతురతా భవ వ్యాకులమునఁ
బలుకఁ గని కన్ను విచ్చి భ్రూకలిత కుటిల
చలన నిర్లక్ష్య భావ ప్రచారుఁ డగుచు
విసువు మొగమున వ్రేల నా వ్రేనిఁ జూచి॰

"గోపబాలక రక్షణ గోపనములె
గాక మా కిట పనులు ముఖ్యములు లేవె ?
పోవనీ చావనీ వాఁడు పొమ్ము వ్రేఁడ"
అనుచు విదిలించి పలికి నంతనె కలంగి.

కుపితమనస్కుఁడైన నెఱగొల్లఁడు, మూపులు మూఁడుగాఁగ, రో
సపు టెఱసంజ నెత్తురుల చారలఁ గన్నులు జేవురింప, ను
గ్రపుఁ గుదిలింపు మేనఁ బులకల్ మొలకల్ తులకింపఁ, బట్టఁ బ
గ్గపుఁ దుద లందనట్టి నిజకాయముఁ బెంచుచు నూఁగులాడుచున్.

"ఏమయ ! బాపనయ్య ! కనిపింపని కన్నకుమారుఁ గూర్చి యే
మేమి ! దయావిహీనమతి నింతలు వల్కితి అంపకాఁడవై
పామిన కన్ను మి న్నెఱుఁగరాని యహంకృతి గ్రుడ్డివైతివా
యేమి ? కుమారుఁ డుండినను నిత్తువు, నీయవు, చావఁ దిట్టుదే ?"

అనెడి పుత్రానుకంపా వశాత్మ రౌద్రి
వశుని జిఱునవ్వు దొంతరల్ పఱచి చూచి
సుకవి తద్ద్విజపాలుని సుకృత చయము
సత్ఫలోన్ముఖ మవుట కాశ్చర్య మంది.

"ఎంత క్రోధము బొందితోయీ ? కుమారు
నింత పల్లెత్త సైపవోయీ ? గవీకు
మారు చావ నిమ్మంటివోయీ ? తదంబ
కింతక్రోధము రాదటోయీ ? విలాసి.

సకలాశావనిజీవరాశి ప్రియస్వామ్యమ్మునం దొక్కఁ, డే
యొకచోఁ దల్లియుఁ దండ్రి పుత్రమరణోద్యోగమ్ము హర్షింతు? రీ
యొక లేదూడకు నీకుమారునకు నేదో భేద ? మగ్గోవు ప్రే
మకు మీప్రేమకుఁ దారతమ్యమెది?చుమ్మల్ సామ్యముల్ మిత్రమా!

వాఙ్మనః కాయ హింసా ప్రవర్తనమ్ము
మనుజ పశు పక్షి సముదయమునకు సమము
వాఙ్మనః కాయ కరుణా ప్రవర్తనమ్ము
మనుజ పశు పక్షి సంతానమునకు సమము.

మట్టిగడ్డను రత్నమాణిక్యఖనిఁ జేసి
పండింప నోపు గోవత్స మోయి!
సర్వమానవ భార నిర్వాహక విహార
పాటవాస్పదము గోవత్స మోయి!
అఖిలహైందవ పూజితాంబా మహాశక్తి
భవ మౌక్తికమ్ము గోవత్స మోయి!
ఈశానరజతాచలాశాటనావైభ
వోత్సుకనంది గోవత్స మోయి!

దుష్పథము దిద్దు ధర్మచతుష్పదమ్ము
పాలు చేఁపుకుఁ దెచ్చు గోవత్స మోయి!
గోకుమారుఁడు గల భూమి నాక మోయి!
గోకుమారుఁడు లేక చీకాకిదోయి!"

అని హితమ్ముగ వెలార్చుసమయమ్మునఁ జిక్కిన బక్కడొక్కతోఁ బొనిఁగిన కజ్జలంపుఁ గనుమోసల క్రొంబుసికట్టుతోడఁ గుండను బురడించు పెక్కుపొదుగుడంబున వ్రేలు చతుస్తనంబుతో మొనసిన వేదనాభరముఁ బొందిన గో వాకఁ దేగుఁదెంచుచున్.

# గో వ త్స ము

ఆవరణమ్ము చుట్టి బుసలార్చుచు డెక్కల దుమ్ముఁ జిమ్ముచున్
ఆవల కేగి తగ్గి పసియానుచు ముక్కుపుటమ్ము లూదుచున్
క్రేవ మెఱుంగుచూపు లురికించుచు నిస్పృహఁ జుమ్మ లందుచ
ఆ వట 'నంబ యంబ' యని యంబుదగర్జన సేసి నిల్వగాఁ.

అంబారావము విన్నవత్సము తదంబారావమే యంచు నే
త్రంబుల్ విస్ఫురితంబులఁ సలిపి, దోరంబెట్టి కర్ణంబు, లా
స్యంబుం ద్రిప్పెను తన్మహారవముదిక్కై; తోడనే తోఁచె ది
వ్యంబై నేత్రసుపర్వ మైన జననీ ప్రాలేయమూర్తి ప్రభల్.

అంబారావము విన్న నిద్రితసుతుం డల్లంతనే లేచె, నే
త్రంబుల్ విచ్చె, పథమ్ము చూచె, డిగెఁ దత్పర్యంక, ముచ్చైచ స్వ
లంబోల్లాపము సేసె; నిల్గడచె, లీలం జూచి మాతన్ పితన్
కంబం బానిన తల్లిపై కుఱికె దిగ్భ్రాంతిఁ సమాలింగఁగాన్.

కొడుకు గోమున కెడయై దిగుల్ పగుల్పఁ
గలఁక బాఱిన మది నొకకడకుఁ దెచ్చి
వణకుఁ బాఱిన మెయి గగుర్పాటు దెలఁచి
బిడ్డఁ గౌఁగిలి హత్తి స్తంభించె మాత.

గవి చనుదెంచి, పుత్త్రమమకారము పారము నెయ్ద శాస్త్రినిం
గవిని నెలంత గోపిక నెగాదిగఁ జూచుచుఁ బోయి, లేఁగ కు
త్సవముఁ బొనర్ప డగ్గఱి యితఃపరభావవిహీనయై కవుం
కవుకవు పాలు చేఁపి సుతకంఠము దార్చెఁ బొదుంగు పొంగులన్.

కవియింటి బువ్వ సొక్కక డొక్క సురిక్కించి
యల్లాడిపోయిన గొల్లకూన
కవిచేతి పోతపా ల్చవిచూచి కుతితీఱ
కటమట నకనకలాడు దూడ
కవి బుజ్జగింపు పాకము సైప కా జేయి
యెల్ల వేగించిన గొల్లకుఱ్ఱ
కవిచూడఁ బెరతల్లి కాలితాపునుఁ బొంది
వెలవెలఁ బోయిన వెట్టిదూడ

ప్రాణములు లేచివచ్చినట్లై, మొగమ్ము
వాచినట్లయి, పులకల పంట మునిఁగి
మోవిఁ గురిమ్ముచుఁ గుప్పుచుఁ ద్రావెత్రావె
సంతతస్విన్నదుగ్ధపరిసారవృష్టి.

## గోవత్సము

కాలు కదపఁడు, పలుకఁడు, కను మలఁపఁడు
క్రేపుబిడ్డలఁ జూచి గోగోపికలనుఁ
జూచి రాపడె గోపాలసుందరుండు,
సుకవిలాక్షణికులు తన్నుఁ జూచి చూడ.

అంజలి ఘటించి కవిని వ్రేఁ డల్లఁ జూచె
హర్షబాష్పాంబు కణనిచయంబు లురలఁ
దత్పురాదుష్కృతాంబుదతతులు విచ్చి
ఆత్మగగనమ్ము నిర్మలమ్మై వెలింగె.

నళినీకామిని నిల్చి పెంౢచవికెన్ నవ్యాతినవ్యప్రభా
లలితాస్యమ్మున దివ్యజీవకళికల్ ప్రాల్గా వెలారించి, ని
ర్మల బాలారుణ మూర్ధమున్ నినిచినన్, రాలెం దలంబ్రాల వ
న్నెల సింగారపు బంగరుం గిరణముల్ నేత్రాభిరామమ్ములై.

ఇది చతుర్థపాదము

ఓం

తత్సత్

మే. 1941.